శ్రీ

# వధూ విజయము

ఉ. శ్రీ మణిలలామ తనచెల్వు వక్షము జేసినిచ్చలుం
బేరిమినాడుకొంచుఁ గడు మేదుకనుండెడు నామ కోడలిన్
ధారుణినెల్లనిచ్చి ధనము దూరేడునత్తపోరులన్
దీరిచి వెల్లలోకములఁ దేజరిలంగ నొనర్చుగావుతన్

నాంది చేసి సూత్రధారుఁడు ముందు నడిచి తెరవంక జూచి

సూత్ర.— మారిషా, యొకమాటిటు రా,

(ప్రవేశించి పారిపార్శ్వకుఁడు)

పారి.— బావా, ఇదిగో వచ్చినాఁడను.

సూత్ర.— ఈ రాజరాజనరేంద్రపట్టణమున నిప్పుడు వసంతోత్సవమునకై చేరియున్న ఈమహాజనులయెదుట శ్రీపాద కృష్ణమూర్తి కవిరాజసహాయంబున శ్రీ, వై. ముద్దారసామయ విలాసార్థము క్రొత్తగా రచియించిన 'వధూవిజయము' అను [illegible]ంగారరూపకమాడి సంతోషపెట్టి మెప్పొందవలయునని తలంచినాఁడ.

పా.— నీవు సిద్ధసంకల్పుఁడవు, అటులే చేయుము.

సూ.— మన కిప్పుడు పాత్రసామగ్రి యంతయు సిద్ధముగా నున్నదా?

పా.— నీయాజ్ఞయైనయెడల సర్వసిద్ధముగా నున్నది.

సూ.— మంచిది యిప్పుడైతే,

అ సాధువైన భూదేవత తనసుతరత్నమైన వరచూతముతో
సతికి నవవసంతలక్ష్మిని, సతిఁగోడలి వేడుకఁజూచి సంతసమందుఁగా.

పా.— ఆ, తనకుమారుఁడైన రసాలవృక్షముతో వనలక్ష్మి గూడి క్రీడించుటం జూచిజూచి భూదేవి మైచి సంతసించుట మిక్కిలి యాశ్చర్యము గదా!

సూ.— కన్నకొడుకునకు గుణవతియైన సతి దొరుకుటంజూచి కొ

ఆ. నాకువశముజువ్వనాల్గు వేదంబులు
నాఱుశాస్త్రములసమస్తకళలు
సకలరాజదివ్యసభలునువశ్యంబు
నీవువశముగామినికరు—మువిధ.

విద్యావైశద్యంబున నెల్లదేశంబులవశంబుచేసికొనిన నాకు నీవువశంబు గాకునికిఁజూడ మిక్కిలి యాశ్చర్యమే,

దురా—వశ్యురాలగానని మాటవరుసకుంజెప్పితి నెప్పుడేని నీకు వశ్యనైన నగుదునుగాని, ఎక్కడినుండియో వచ్చినదానివశమున నే నెన్నటికి నుండుదానఁగాను,

సుశీ—అయ్యా! అజ్ఞానురాలా, సంసారభారమంతయు నెత్తిమీద బెట్టుకొని భరించుటకు సమర్థులై కొడుకును గోడలు నున్నచో మూఁడుకాళ్ళ ముసళ్ళు తల్లిదండ్రులు అవశ్యముగా వారికి వ— శ్యులైయుండవలయును సుమీ!

దురా—అమ్మకారు యెక్కడినుండియో కొనితెచ్చినమువ్వకడికి దానికిఁ బాదసేవచేయుచు నీవుండినసుందువుగాని నేనట్లుండను బహుదినములనుండి నామీఁదనున్న యింటిపెత్తనము దానిమీదఁ బెట్టుటకు నేనిష్టపడియుండగలనా?

సు—మనపిల్లవాఁడు బుద్ధిమంతుఁడై పాఠశాలయందుఁ జదువుచున్నప్పుడు రుగుపొరుగువాండ్రకు పెండ్లియగుటఁ జూచి నాకును గోడలెప్పుడువచ్చునోయని ముచ్చటబడుచు "అబ్బాయికిఁ బెండ్లి జేసినారుకారుగదా" అనినన్ను పెండ్లిచేసినదనుకఁ గోరికకొనితినలేదా? మఱియును "నాకోమారునకు మాఱుపోఁగుపడ నేనెన్నడు కన్నులారఁజూతునో? నాకొడుకుతో జంటపిల్లలను వెంటఁబెట్టికొని మనుగుడుపునకై వియ్యాలవారింటికి నొయ్యారంబున బోయి అక్కడవారుచేయు నానావిధమరాదల నొందుచు వియ్యపురాలితనము నేనెప్పుడు చూపుదునో

ఆ. తండ్రియింటనుండి తనరెడు కోడలు
నాదురాకఁజూచి నయముమీఱ
చెంతఁజేరినాకుసిగ్గునఁదలవంచి
మొక్కఁగాఁగలుంచుపుణ్యమెపుడొ?"

అని యనలేదా?

దురా—దేవా, నీవు చెప్పినదిదిట్టముగానున్నది అప్పుడది సుఖమట్ల తోచినది ఇప్పుడైతేనో నాకు కోడలు విషప్రాయమైయున్నది

సుశీ—తనలో ఆహా! కాలమహిమ అమృతమైనను విషమగును గదా! కొడుకులుగన్నకొమకు కులోద్ధారుడై పరలోకమందున్నపితృదేవతలఁ దిలోదకధారలచేఁ దృప్తినొందింపఁడా? అట్టిం డలిని ఇది విషముగాఁ దలఁచుచున్నది అప్పప్పా! ఎంత చెప్పినను ఈగండ సుంతయైనను నామాట పాటిచేయలేదు దీనిమాటలిని నేనిప్పుడు కోడలితో విరోధప త్తినేని గుణవంతుడు నాకొమకు నావిషయములో నుదా నుఁడగును ప్రేమించితినేని యీగయాళిగంత నామీఁద లేనిపోని అపవాదను తెచ్చిపెట్టునుకను నేనిఁక ఏవంకకు దిరుగక తటస్థుండనై యుండెదను ముందుజూచి) దీనిబుని జక్కఁజేయుమని మొదట నేను చెప్పిపంపించిన మించుబోఁడి అదిగోవచ్చుచున్నది నేనిటనుంటినేఁ గార్య భంగమగును ప్రకాశముగా పంకజాక్షీ, ఇంక నీయిష్టము నన్నుమాత్రము కష్టపెట్టకుము

అని నిష్క్రమించెను

అంతఁ జారువృత్తయను సఖి ప్రవేశించుచున్నది

దురా—ఓసి, చారువృత్తా, నాకష్టము చెప్పుకొనుటకుఁజాలసేపటినుండి నిన్నుఁదలఁచుకొనుచు నీరాకకై కనుపట్టికొనియుంటిని

చారు—ఓసీ, సఖీ, నీకుగష్టమెట్టిది?

దురా—చాలదినములనుండి కన్న దేవళ్ళకెల్లఁ జేతులుమోడ్చి మోడ్చి

ప్రార్థించుచు ననేక శుష్కోపవాసములు చేసిచేసి కష్టపడి యెట్లో ఒకకొడుకును బడసితిని.

చారు—సఖి, పుణ్యముల లేకయిట్లు కొమరుకెట్లుపుట్టును?

దురా—నాకుమారుఁడు మంచివాఁడనుటకు సంశయ మెంతమాత్రమును లేదు

చారు—తనలో ఈదుర్మార్గురాలు కోడలిమీఁదదోషము నారోపించుటకు ఉపక్రమించుచున్నది

ప్రకాశముగా మఱి యెవ్వఁడు దుర్మార్గుఁడని చింత?

దురా—మఱియెవ్వరని చెప్పను.

~~చారు—కుమార్తెయొక్క దుర్మార్గతచేత వ్యథపడుచుంటివ యేమి?~~

దురా—అయ్యో! యేమిమాట చెప్పితివి. నాకుమార్తె యోగ్యురాలను నీవెఱుంగవా? ఈచెప్పిన వేమియునుండగా నావ్యథను వినుము. అనుకూలురాలైన కోడలినిబడయవలయునని చట్టాలఁ జూచుట వంక బెట్టుకొని ఊరూరికిం బ్రయాణంబుజేసి ప్రయాసమీఁదఁ గొనితెచ్చిన నాకోడలు నా హృదయశల్యమై యిప్పుడు వేధించుచున్నదిసుమీ

చారు—ఆపిల్ల యేమిచేసినది?

దురా—ఇదిచేసినది అదిచేసినదియని యేమని చెప్పను.

చారు—ఒకటి రెండుతప్పులు చెప్పినంజాలదా!

దురా—వినుము నేను సుగంధద్రవ్యములువేసి కాచుకొన్న అగరునూనె తన తలకు రాచికొని నేనుదాచికొన్న జాజులు మొల్లలు మల్లెలునుందోచుకొని తాను ముడుచుకొని మగనియొద్ద కొయ్యారంబుతోఁ బోయెను.

చారు.—ఇది యెంతమాత్రపుతప్పు దీనిచేతనేనా నీకింతవ్యథ?

దురా—ఆఁ ఊఁ ఏమిచక్కఁగా జెప్పితివి! దీనియీచేసినపని తనమగని వశపరుచుకొను ప్రయత్నముగదా!

చారు—వశపరుచుకొననీ! దానివలన నీకేమినష్టము

పనిలేయున్నట్లు నీనయించి ఇంటిలోనికిపోయినది. వింటివా?

" ,—కోడలు ...గుగానే కుశలప్రశ్న చేసియుండును. నీకూఁతు రు ...నపదిన మగని యింటినుండి వచ్చునేని పలుకరించవలసి వచ్చునని వెలుపలకు పోవునుసుమీ?

దురా.—ఎందువలననీవిట్లు చెప్పుచున్నావు?

చారు.—నీకూఁతురైనందువలననే!

దురా,—నేనేమి అంతచెడ్డదానవా?

చారు.—కాకుంటె నీవు కులశీల రూపగుణ లక్షణములచే నొప్పుచుం ను కోడలినెందు ... నిందించుచుందువు?

దురా—ఓహో! నీపక్షపాతబుద్ధి తెలిసినది. బుద్ధిలేనిదానా, దాని దుర్గుణములు వినియు నీవిట్లుకూసెదవేమే?

చారు.—ఎవరిదుర్గుణములు ఎవరెఱుఁగరు? అన్నిదేశములవారు నెఱుఁ గుదురు.

దుర్గా.—(కన్నీళ్ళువిడుచుచు) అయ్యో! పాపాత్మురాలా, కోడలిరూ పునవచ్చిన కొరవి, నీకొఱకుఁగదా ఎల్లరును నిన్నునిందించు చున్నారు, హాపాపుకోడలా. (అని గుండెలుమోదుకొనుచు దుఃఖించుచున్నది.)

చారు.—ఎందుకింత చింతపడెదవు? దుర్గుణమువిడిచి మంచిగుణము దాల్చి కలిగినకొలఁది కడుపునకుందినుచు పేగొడవకు పోక సుఖముగానుండరాదా?

దుర్గా.—నీచురాలా, "అదివిసరివేసిన పిండమునుదినుచు దాసివలెఁబడి యుండుము" అనినాకు బుద్ధిచెప్పుచున్నావా?

చారు.—కష్టపడక సుఖముగానుండుమని చెప్పుచుంటిని.

దురా.—నాసుఖముచట్టఁబెట్టుకొని పోయినట్టుగానేయున్నదిలే. నా యింటిపెత్తనము అతోత్తునకిచ్చి నేనుదానిసను కావలయు నా? చూడుము నాచాతుర్యము కొన్నినాళ్ళలోనే అదుష్టను

• అత్తకోడలు యజమానురాలై ఇలుదీర్చుట జరుగునదియే.

దురా.—ఓ , మూర్ఖా, నేనుండగానే దాని కి పెత్తనమిచ్చినారుచు
న్నావురా!

సుగు.—అమ్మా.

క. తెలిసినవారుక్ వద్దురు. తలిదండులసొం... మెండుగ దమగృహభారం
బలరక్ గొడుకు పైకో, డలిపై యు ' వేల్పలంచని వినవే.

దురా.—ఓరీ దురాత్ముడా, పెండ్లానికి ఇంటి పెత్తనమిచ్చి ఇల్లు తా
కట్టవలెనని పెద్దవాననుకున్నావురా? వరకేసీయె
ద్దె పెండ్లాము తను రోజును బగలంగొట్టగా మిగిలి కంచము
ముంతచాటుచాటున మూటగట్టి పుట్టినింటికి తరలించుచు
న్నది. ఇంకఇల్లు గుల్ల చేయకుండునా? వు పెద్దబంగారుగొం
డ నెత్తిమీద నెక్కించుకోవడంచేత ఇంత క్రొవ్వి గణేభరిం
ఎవ్వరిని లక్ష్యపెట్టుటయు లేదు.

సుగు.—అమ్మా, సంసారభారమంతయు దాని నెత్తిమీద వేసినయెడ
ల అదియెవ్వరికి ఏమియు సేయక జాగ్రతగానే యుండుననని
తోచునమ్మా.

దురా.—ఆ—ఆలాగునా? దాని మందు తలకెక్కినది ఇంక నీకదే
మగడైచారి చేయించుకొననునే!

సుగు.—మందులు, మాకులు, మంత్రాలు, తంత్రాలు, లేకున్న మగ
డు పెండ్లామునకు ప్రీతిపాత్రుడు కాడటమ్మా? మాబావమా
ర్గాలిని అన్లేకదా

దురా.—ఏమి మొరుగుచున్నావురా! పెండ్లామువలె నాకూతురు
ను మంత్రతంత్రాదులు నేరిస్తే మగనిగట్టిగా వశము చేసుకొ
నలేకపోవునా? అది కూడదని సద్గుణములుకలదిగావున ఏమి
చేసినను వానిసేవించుచునే యుండను వాడేమ దుర్మార్గుడు
దానికివశముకాడు నీపెండ్లామునీ నీవైనన్లైతే నాకుచాలును
అప్పుడు ఎవ్వరిజోలిఅక్కరలేదు.

సుగు—తల్లీ, ఆ ఁడు కూతుఁని న్నగాజూడఁడని ేడలిపై కోప
ముచూ ఎన ములాభము;

దురా—మాటకు మాటచెప్పి నానోరు మూయఁగ న యున్నావా?
మూయలేవు వినుము, దాని తండ్రి అ దుర్మార్గుఁడు, తల్లి గ
య్యా అ ెదమ్ములు విటకాండ్రు అక్కచె ండు వ్యభి
చారిణులు, అనిలోకమంతయు ఎరు ను నీవుపిల్లవాఁడవు నీకే
మి తెలియును దానికులముసంగతి,

సుగు,—నీ వి ేష్యపురాలు కూతుమీఁది కోపము మనవంశమును ఇ
గ్లైసిం ంచిన నీవేమి చయుదువు; మనములలో చి తెచ్చుకు
న్నదానివిషయములో ఇ తచె ్పటసరికాదు

దురా,—గ్రహచారము తెచ్చుకొన్నాము నే నేమిచేయుదు ఇ నీఅదృష్ట
వశము

సుగు— మనస్సులో తల్లిదండ్రులు ఏమన్నను కోపింపక పూజింపఁ
బడినవారు (ప్రకాశముగా అమ్మా, సుగుణురాలుగానీ! దు
ర్గుణురాలుగానీ! దీనిని తెచ్చుకొంటిమి ఇప్పుడుకూతునందున్న
దయదీనియందును ఉంచికాపాడుము అనిప్రా ించుచు కా
ళ మీదఁ బడుచున్నాఁడు)

దురా—ఛీ ఛీ! లే! లే! ఈ గుడిసేటిదానిని నాకడుపునఁ ట్టినదాని
తో సమానముగా ఎట్లుచూతును?

సుగు—అమ్మా, ఎక్కడినుండియో వచ్చిన అల్లునియందు కుమారుఁ ం
టె క్కువదయగానేల చూచుచుంటివి;

దురా—నా అల్లుఁడు కోడలువలె నేమి అపరాధముచేయుచున్నాఁడు

సుగు—అమ్మా, నేనుచాటుననుండి వినుచుండఁగా నీయ ుఁడు కూ
తుఁ 'తొత్తుకూఁతురా' అనిపిలువఁగా నీవునువిని నవ్వుచు నూ
రకు టివిగాని యేమియుఅనవైతివిగదా।

దురా—నేను టుననుండి వినుచుంటినని మరుగు ట్టనేల? నాపెం
డ్లాము ఒప్పినది అనరాదా! దానిమాటలు... యీలాగం

సచ్చ.—అట్లే కావింతును అనినమస్కరించి యొకమూల దాగియుం
డును) (సుశీలుడు ప్రవేశించుచున్నాఁడు

సుశీ.—అయ్యో! మూఢురాలగు నాభార్య కోడలినిఅన్యాయముగా ద్వే
షించుచున్నది. అని రేబవలు నాకు నిద్రాహారములు కలుగకు
న్నవిగదా,

సుగు.— సమీపమునకువచ్చి నమస్కరించి) నాయనగారూ, ఇదియే
మి? ఏమేమోచింతించువారివలె నున్నారు?

సుశీ.—నాయనా, న్యాయదృష్టి నాలోచించినయెడల కొడుకును కో
డలునుసమానులేకదా,

సుగు.—కోడలు మంచి నడవడికగలదిగా నున్నచో అవశ్యముగా దా
నిని కొడుకుతో సమానముగా నెంచవచ్చును. అదిదుష్టురా
లుగా నుండినప్పుడో?

సుశీ.—వారివారి అదృష్టమునకుఁదగినట్లు కోడలుదొరుకును, అత్తమా
మలుదానిని కడుపునఁబుట్టినదానివలెఁ జూచుకొనవలెను, కూ
తునకెంత సొమ్మిచ్చినను తృప్తిపొందదు కన్నవారి యిల్లంత
యు తనమగనికేఁగట్టిపెట్టించుటకే తలంచుచుండును. అన్నద
మ్ముల భార్యలు కొంచము బాగుగనుండిన చూచి సైపక
అసూయపడుచుండును.

సచ్చ— తనలో) ఇట్టినాయదృష్టిగల మామగారు పూర్వపుణ్యము
న నాకులభించినా.

సుగు—నాయనగారూ, స్త్రీలుఅల్లురయందు ప్రీతిచేయఁదగినదే, అ
ల్లుఁడుసంతోషించినప్పుడే కూతులకు సౌఖ్యముగలుగుట,

సుశీ—నాయనా, కోడలివలననేకదా కొడుకుగృహ శ్రమమునొంది
సత్కర్మలాచరించుచుఁ బితృదేవతల స్వర్గస్థులఁజేయును?

సుగు—అవునుగాని యొకవిశేషమున్నది. కోడలుఇక కొకలోకమునకు
బోయినను మఱియొకతెవచ్చి గార్హస్థ్యమును నిలువఁబెట్టు

ను అల్లుఁడు మఱియొక లాఁగైనయెడలఁ గూతురు దిక్కులేనిదై పోయి బాధపడుచుండదా?

సుశీ—కొడుకు తొంటిభార్యను బోఁగొట్టుకొని మఱియొకభార్యను గట్టుకొనుటమాత్రము సంతోషమా? అదిఆవయస్సులో సమానవహీనమైన రూపమందితిమేయని యన్నట్టకని బ్రీతిచేయ నేరదు.

సుగు—ఆరెండవది మంచిదైనయెడల వయసుమీరిన తనభర్తయందు అననురక్తురాలైనను వృద్ధులైన అత్తమామలను ఎందుకు పూజింపదు.

సుశీ—లోకములో అత్తమామలయందు ద్వేషము కోడలికి స్వభావసిద్ధము. ఇంకమగనియందు అనురాగము లేనిచో వారినెట్లు పూజించును?

సుగు—నాయనగారూ, విశేషముగా మాటలాడుటవలన నేమిప్రయోజనము? ఇఁక నేమిచేయవలయునో ఆజ్ఞాపింపుఁడు.

సుశీ—కుటుంబములోఁ గలతలుపుట్టినయెడల గృహయజమాని వారివారిని వేఱుపెట్టవలయును:

సుగు—తమయిష్టము. కానికలకాలమునుండి జాగరూకురాలై సంసారమును జక్కఁబెట్టుమాయమ్మను మాలోపలనే ఉండనిండు కోడలికిమఱియొకయిల్లుమాత్రము,

సుశీ—ఇదివఱకు అన్నిసుఖములను అనుభవించిన ఆముసలిగూబకు ఏదైననొకపాతయిల్లు చాలదా? సొగసైనలోగిలియేల?

సచ్చ—ఇట్టిసంవిధానమునకనే మామగారికి సుశీలుఁడు, అనుపేరు సార్థకముగా వచ్చినది, కానీయాయన మాటలప్రకారము నామగఁడు తల్లిని మఱియొకయింటియందుంచినచో "పెండ్లానికి వశుఁడై తల్లినితఱిమివేసినాఁడు" అను అపకీర్తివచ్చును,

సుగు—మంచిమాటచెప్పినావు, ఏమి నాచెల్లెలు వచ్చుచున్నట్లున్నది

సుశీ—అవును దిగ్గనలేచె. ఇదిమగనికంటెముందు తల్లినిమీఱునది.

అంతదుర్గత్రికవచ్చి, దుఃఖముతో

దుర్గ.—నాయనా, అన్నయ్యా, మీరెందుకమ్మా అమ్మను ఉపేక్షించితిరి? దానికిదిక్కెవ్వరున్నారు;

సుగు.—అమ్మాయీ, ఇదేమిట్లు చెప్పుచున్నావు?

దుర్గ—కోడలిదుశ్చేష్టలకు దాళజాలక రేయింబగళ్లు కన్నీరుగ్రుడుచుచున్నది ఇట్లున్నచో ఆయుక్షీణము కాకపోదు. అనియేడ్చుచున్నది

సుశీ—ఇంకనీయమ్మకు చావేయుక్తము.

దుర్గ.—దుర్మార్గుడా, నీకేమి, ఉపచారమునకు నీకుగోడలున్నదని గర్వము. నాకెవ్వరుదిక్కున్నారు.

సుశీ—నీమగడు అత్తగారును దిక్కులేరాయేమి?

దుర్గ—ఆముండ నిర్దయురాలై నామీదతప్పులనే ఆరోపించి నామగనికిగొండెములుచెప్పి నన్నుతరిమివేసినది. అదియొకవైపున మాయమ్మకు వేధించుచుండగా మీపోరొకవైపున వచ్చినదిగదా!

సుశీ—మీయమ్మ తనకోడలికిపెట్టుబాధ దానితల్లికిని సంకటముపెట్టునని జ్ఞానము లేకపోయినదిగదా!

దుర్గ—కోడలిమాటపైనమ్మిక నీచేత నిట్లుకూయించుచున్నది, ఇదిగాక నీవు ఆకోడలిముండమాట విని యేతీరవలయును. దానితండ్రి శరీరమునిండా బంగారు రత్నాలునిండించి మంచిమంచిబట్టలుపెట్టి పంపించినాడన్ని నీవువిట్టివీగి యెవరినిజూడవు.

సుశీ—నీశరీరము తాలుతోనిండించియున్నదా? అహా! స్త్రీలకు సొమ్ములయందు తృప్తిలేనేలేదు. యెన్నిపెట్టినను "ఇదిచాలవు అదిచాలవు" అనితండ్రిఇల్లు కూతురుదోచికొనిపోవుటకే ప్రయత్నించుచుండును. ఇదియిట్లు సిగ్గెచ్చినను అల్లుడునీతండ్రియేమిచ్చినాడని హేళనముచేయుచునేయుండును.

దుర్గ—ఆహా, యీముసలివాడు చెప్పినది అసత్యము, నీవు నీమామగారిని ఎన్నఁడైన సొమ్ములకుగాని ఎందులకుగాని నిందించినాడవా?

సుగు— ఉత్తరమీక ఊరకుండును

సుశీ—దుష్టులైనకూఁతురు, నల్లుఁడును, ఆగువీరిమాటలు చెప్పినాఁడనుగాని లోకమంతయు నిట్లేయుండునా?

క. మంచిగుణంబులకూఁతురు, కొంచబేఁ దండ్రిసొమ్ముఁగొనితృప్తిపడున్
గొంచెముచదివినయల్లుఁడొ,కించుకతనమామదూర నెంచడుమదిలోన్

క. దుష్టయగు కూఁతురైనన్ నిష్టంబుగ సొమ్ములంది యెంచదుతండ్రిన్
దుష్టుఁడగుఅల్లుడట్లే, కష్టంబులపాలుసేయుఁ గడుకొనిమామన్,

సుగు—అమ్మాయీ, వాదమెందుకు? అమ్మయేమిచెప్పుచున్నది?

దుర్గ—"ఈకోడలితో నేను కాపురము చేయలేను" అనిచెప్పుచున్నది.

సచ్చ—దైవయోగముచేత అత్తగారు నాయభిప్రాయమునే అనుసరించినది. ఎందుకనఁగా నడవిలో ఆకలంబులుతిని సుఖముగా బ్రదుకవచ్చునుగాని సంసారములో జగడముపుట్టినమీఁద మేడపైనుండి ష్టాన్నము భుజించుచుండినను సుఖములేదు.

సుగు—అమ్మాయీ, వదిననెక్కడైన నొకయింటవేరుపెట్టియుంచెదము, చింతించకుము.

సుశీ— కోపముతో ఈపిశాచికి ఇష్టమువచ్చినట్టుగా నడు కొనవలయునా? నెలనెలకుఁ గావలసినబియ్యము పప్పులోనగు తిండివస్తువులిచ్చుచు మీఅమ్మను నిని పేరుపెట్టుము.

దుర్గ—నేనువచ్చి ఇక్కడ మా అమ్మతోఁ గూడియుండుట నీకునిష్టము లేదు, గనుకనే ఇట్టిమాటలు చెప్పుచున్నావు.

సుశీ—నీయిష్టమువచ్చినప్పుడు రావచ్చును, పోవచ్చును, నీఅత్తవారింటి కష్టమును పోగొట్టుకొనవచ్చును.

దుర్గ—హాపాపీ, మా అమ్మలేనియింట్లో ఎవతెయో యొకతె వేసినపిండముతినియుండుటకు నాకేమియిష్టముండును, నాకుసుఖమేది

సుశీ—నీవట్లు తలంచుపక్షమున నీ యమ్మయుండుచోటునకు వచ్చి అ క్కడనే యెంతకాలమైనను ఉండవచ్చును- అప్పుడు నీభోజ నమునకుఁ గావలసినంత ద్రవ్యమునిచ్చెదను,

దుర్గ—నన్ను దాసినిఁగా నెంచితివా?

సుగ—ఎంతపాటి ద్రవ్యముతో మీరిద్దఱును సుఖముగా భోజనాదిక మును జరుపుకొనఁగలరో అంతపాటివడ్డిపచ్చు ధనము మీకి చ్చెదము.

దుర్గ—తనలో) ఇది నాకు సమ్మతమే! ఇట్లు మొత్తముగానిచ్చు ధనము లో కొంతవడ్డికిచ్చి మిగిలినది పెట్టి మా అమ్మనాకు సొమ్ములు చేయించిపెట్టగలదు. (ప్రకాశముగా అన్నా, నీమాటనమ్మ కముచే అమ్మనుల్లాఁగే సమాధానపఱచెదను.

సుశీ—అమ్మ నిర్బంధించవలదు, అమ్మకెట్లుయిష్టమో అట్లుచేయుటకు సిద్ధముగానున్నాను.

దుర్గ—(తటాలునలేచిపోయి తల్లినిపిలుచుకొని ఏకాంతమునందు జరి గినదియంతయునుచెప్పి ఆమ్మా నామాటత్రోసివేయవద్దు: ఈ యేర్పాటు మనకనుకూలమే

దురా—బిడ్డా, ఇది నాకును యిష్టమైనదియేకాని మొదట యిష్టముగా నిదానివలె నభినయించెదను నీకైధనమునురాబట్టుట కిదేమం చిసమయము

సుశీ—(తలనువంచుకొనియుండును

సుగు—అమ్మా, అనునంతలో

దుర్గ—ఓరీ, మూర్ఖా, 'అమ్మా' అని పిలువ నక్కఱలేదు, చాలు నీపెం డ్లాము నీచెవులలో జపించినమంత్రము సిద్ధించినది,

సుగ—అమ్మా, నామీదకోపింపవద్దు ఈయేర్పాటు నేను చేయలేదు మానాయనగారేచేసిరి.

సచ్చ—(తనలో భగవంతుఁడా, నామగనిని తల్లి శాపమునకు లో నగునట్లు చేయవద్దు

దురా—అయ్యో! అదృష్ట చాతుర్యము వలనవానిని వశపఱచికొనినది.

సుశీ—దుష్టా, దానిసుగుణములు సజ్జనులనందఱిని వశపఱచికోనఁ గలదు.

దురా—ముసలితనముచేత బుద్ధిలేక నీయబ్బమొరిగివదానిని నీవుఅంగీకరించినచో నీకంటె చేత గాని వాఁడెవడుండునురా.

సుశీ—మంచిదిమైనను కోడలినిదూషించుచు లేచిపోఁదలఁచిన నీవు పడుచుదానవై యిప్పుడుమంచిబుద్ధిచే ప్రకాశించుచున్నావా?

దురా—ముసలిముండాకొడకా, నీవేలేచిపో, నేనుపోవుదానను కాను.

దుర్గ— ఏకాంతమునందు నాకొఱకేమైనను సంపాదించుటకిదేమంచిసమయము

దురా—ఓరీ దురాత్మా, పెండ్లాముదాసుఁడా, తల్లినితోలివేసిన అపకీర్తినిపొందుమ, నేను పోయెదను. ఇంక నీపెండ్లాము ఇష్టములను నెఱవేర్చుము. మంచిమంచి నగలను చేయించిపెట్టుము

సుగు—అమ్మా, నీమాట జవదాఁటలేను

సుశీ—పాపీ, సొమ్మంతయుకూతునకు కట్టిపెట్టికొడుకును దరిద్రునిగాఁజేయవలయునని యున్నావా?

దురా—ముసలీ, కూఁతురి సంతోషమును జూచి వేలయోర్చలేవు? అని నగలు పెట్టుకొన్న చూచినన్నుకుట్టునా?

సుశీ—తల్లి నోరునుబిలములేమన్నచో కూతురనే ఎలుక పుట్టినింటినుండి ధనమను ధాన్యమెట్లు దోచికొనును?

సచ్చ— ముందుచూచి) దైవయోగముచేత అత్తగారి చెలికత్తె చారువృత్త వచ్చుచున్నది, ఆమె నాయందు కడుంగడు విశ్వాసముగలది

చారువృత్త ప్రవేశించుచున్నది

చారు—సఖి- ఏమిచింతించుచున్నావు?

దురా— ముఖమునుద్రిప్పుకొనుచున్నది.

చారు—ఓ సఖి "గుణవంతుఁడగు కొడుకును శ్రీ ముగా బడయు" ని ఆ గంధించుము.

దురా— తనలో ఏమైననుసరేకాని నాకూతురికి నగలకుసొమ్మువ నంత చిక్కుచున్నది ప్రకాశముగా కూఁతురా, నడ పోదము అనికూఁతురుతోఁబోవుచున్నది

సుశీ—బాబూ, మవును ఒప్పుకున్నవని నెఱవేర్చివేయుదము అ కుమారునితో పోవును

చారు—అమ్మాయీ, నీకింకేమియిష్ట మా

సచ్చ—పూ రాలా, దైవయోగముచే అత్తగారు ఏమీతిట్టక ఊరక కూఁతుతో వెడలిపోయెను, నా కోరికలన్నియు నీమూలమున నెఱవేరెను కావలసినది యింకేమియు లేదు అయినను;

గీ॥ అత్తగారు కూఁతునట్లు కోడలిఁ
గోడ లత్తగారిఁ గోరుతల్లి
యట్లుకనుచుఁ బ్రేమ ననిశ ము సుఖియింపఁ
జేయుఁగాకయనుచు శ్రీశుఁగొలుతు॥

వధూ జయము

మా ము.

